Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యుం I.] మద్రాసు : 1941 వ సం॥ అక్టోబరు నెల 3 వ తేది శుక్రవారం [నెం 29 రు

## ఆక్రమిత దేశాలలో జర్మనుల క్రౌర్యము.

### ప్రజల కష్టాలు, కఠిన శిక్షలు.

జర్మనీ ఆక్రమించిన దేశాలలో జర్మనుపోలీసులు, సిపాయిలు చేయుచున్న అక్రమాలగూర్చి ప్రతిదినం వార్తలు ఎక్కువగావస్తున్నవి. ఆదేశాలలో ప్రజలు జర్మను యజమానులు పెట్టుచున్న కష్టాలను ఓర్చిఓర్చి విసుగుచెందిరి. వారిపై ద్వేష మతిశయించినది. ఆదేశాలలో జర్మనులకు ప్రతికూలంగా అనేక కుట్రలు రహస్యంగా జరుగుచున్నవి. కాని, ఆవిషయం ప్రకటించినచో జర్మనీ మరింత కాఠిన్యము చూపునని భయంచేత ప్రకటించుటలేదని అమెరికా మంత్రి కార్డెలు హలుగారు తెలిపియున్నారు.

#### పోలండు.

హత్యలు, దారుణహింసలు, దోపిడులు, తుపాకులతో కాల్చుట, కార్మికులచే నిర్బంధంగా పనిచేయించుట, పాఠశాలలు, కాలేజీలు మూయించుట, యిట్టిచర్యలు ఆ దౌర్భాగ్యదేశంలో పరిపాటయిపోయినవి.

#### జకోస్లొవేకియా.

ఈ దేశంలో నిరంకుశ పాలనము నానాటికి హెచ్చినది. ప్రజలకు పాలకులపై ద్వేష మత్యధికమగుటచేత, నాజీ అనుకూలుడును దేశీయుడగు (క్విస్లింగు) కమీషనరు పనిమానుకొని పోతే, నాజీ సేనాధిపతియే అతని స్థానే నియమింపబడవలసి వచ్చెను. (దేశద్రోహంచేసి శత్రువులతో చేరిన నాయకుని క్విస్లింగు అంటారు). ఈ యుద్ధంలో క్రొత్తగ సృష్టింపబడిన మాట యిది. నార్వేలో క్విస్లింగు అనువాడు యిట్లు చేయుటచే అతని పేరే "దేశద్రోహం" అనుటకు పర్యాయ పదమయింది. జకోస్లొవేకియా ప్రధాన మంత్రి దేశద్రోహమునకు కోర్టులో విచారింపబడెను. బొహిమియా, మొరేవియాలందు సైనిక శాసనం ప్రకటింపవలసివచ్చెను. ప్రజలంత తిరుగుబాటు చేసిరన్నమాట. మార్షలు లా కోర్టులలో వెంటనే శిక్షలు విధించబడును. వాటిపై అపీళ్లుండవు.

#### యూదులు.

యూదులగతి ఎట్లున్నది? జర్మనీలో యీ దిగువరీతి ఆర్డరు ప్రకటింపబడినది :- ఆరేండ్లకు పైబడిన యూదులందరును గుండెలపై ఎడమవైపున నలుపు పసుపు బాడ్జి ధరించవలెను. ధరించకపోతే జెయిలులో పెట్టబడుదురు. యూదులు ఉత్సవాలలో తిరుగరాదు, ఉద్యోగాలు చేయరాదు, అద్దెబండ్లు ఎక్కరాదు, పోలీసువారి అనుమతి లేనిది అంబులెన్సు వైద్యసహాయం మోటారులను కూడ ఎక్కరాదు. ట్రాములు, రైళ్లు మున్నగు వానిలో యితరులు నిలచియుండగా యూదులు కూర్చోరాదు. రైల్వే విశ్రాంతిగదులలోగాని, ఫలహారాదుల గదులలోగాని యూదులుండరాదు.

హనోవరు నగరంలో మిగిలియున్న వెయ్యిమంది యూదులు తమ యిండ్లువదలి శవాల గదులలోను స్మశానాలలోను తాత్కాలికంగా తలదాచుకోవాలని ఉత్తరువుచేయబడిరి. జర్మను ఖైదులలో 1,50,000 యూదులు కలరు. వారిలో సమర్థులగువారందరిని ప్రభుత్వంవారి రోడ్లపైని ఫాక్టరీలలోను రాళ్లు కొట్టేచోట వ్యవసాయమునందు పని చేయించుటకు తీసుకపోవుచుందురు. ఇతరచోట్ల పనిచేసినపుడు ఆర్య జాతి (అంటే జర్మను జాతి) పనివారికిచ్చిన కూలే వీరికి యిత్తురుకాని, అదంతా పన్నుల రూపంలో వసూలు చేయబడును.

జర్మనీ ఆక్రమించిన దేశాలలోనేగాక యూదులను పీడించుట యితర దేశాలకుగూడ వ్యాపించినది. ఫ్రాంసులో యూదులందరు ముఖ్యమగు ఉద్యోగాలు చేయరాదని, బాంకరులుగ, స్టాకు బ్రోకరులుగ నుండరాదని నిషేధింపబడిరి. పత్రికా సంపాదకులుగగాని, రిపోర్టరులుగగాని, భూముల మేనేజెంటులుగగాని యుండరాదు. తన తండ్రి ఫ్రెంచిసైన్యంలోచేరి చనిపోయియుంటేను లేక సైనిక బిరుదు పొందియున్నను యూదుడు పోలీసు లేక సైనికోద్యోగముచేయ అర్హుడగును. ఫ్రాంసులో యూదులు టెలిఫోనులు, రేడియోలు ఉంచుకోరాదు. బ్యాంకులలోని డబ్బుకాని నగలుకాని వాపసు తీసుకోరాదు. వేలకొలది యూదులు అరెస్టు చేయబడుతున్నారు. ఫ్రాంసుదగు మొరోకోలో యూదులందరు గుడిసెలలోనుండవలెనని త్వరలో నిరోధించబడుదురు.

#### ఫ్రాంసు.

డీగాలుగారి స్వతంత్ర పక్షమునకు చెందినవారిని కమ్యూనిష్టులంటూ ప్రతిరోజు అరెస్టుచేయుచున్నారు. లావెలుగారిని చంపుటకు యిటీవల జరిగినయత్నమే దేశంలో ప్రజలకెంత ద్వేషంగలదో రుజువుచేయుచున్నది. ఫ్రెంచివారికి జర్మనులంటే ద్వేషం ఎక్కువై జర్మనులను హత్యచేయుచున్నారు. ఫ్రెంచివారిలో నూటికి 95 మంది బ్రిటిషువారి విజయమునే కోరుచున్నారు. వారి అసంతృప్తికి అనేక కారణములు కలవు - డార్లాను ప్రధానికొసంగబడిన అసాధారణాధికారములు, నాణెముల ధర పెంచుట, ఆహారపదార్థాలు తగ్గిపోవుట, జర్మను సైనికాధికారుల దారుణచర్యలు—పారిసునగరంలో కాల్పులు హెచ్చగుచున్నవి. ఒక జర్మను చంపబడితే నిర్బంధంలోనున్న ఫ్రెంచివారిని ఆ రేడుగురిని చంపుతున్నారు. ఇకముందు యింకా జర్మనులు హత్యచేయబడినచో యింకా ఎక్కువమంది ఫ్రెంచివారిని చంపుతామని జర్మను సేనాధికారి ప్రకటించెను. అయినా ఫ్రెంచివారి ధైర్యం తగ్గిపోలేదు. బ్రిటిషువారు చివరకు గెలుస్తారను నమ్మకం వుండుటచేతనే రహస్య కుట్రలుచేసిన ఫ్రెంచివారు నాజీలకు ఒప్పగింపబడలేదు. తప్పించుకొని ఇంగ్లాండువచ్చిన ఒక ఫ్రెంచి పెద్దమనిషి, డార్లాను ప్రభుత్వము బలంప్రధానంగా పరిపాలిస్తున్నదనెను. "ఫ్రెంచి ప్రజల అభిప్రాయానికి విరుద్ధంగా పరిపాలిస్తున్న యీనాయకులకు ఎన్నడో ఒకనాడు తగిన శాస్తి చేయబడును. జర్మనులు వారివిధి వారు నెరవేర్చుకొనుచున్నారు. వారి ననవలసిన పనిలేదు. కాని శత్రువులగువారికి తోడ్పడుచున్న ఫ్రెంచివారి ననవలెను" అని అతడనెను.

## బెల్జియం.

ఫ్రాంసులో జరిగినట్లే బెల్జియంలో జరుగుచున్నది. చంపబడిన జర్మనులకు బదులుగ ఉరిశిక్షలు విధించుటకై దేశీయులను నిర్బంధించుట ప్రారంభమయినది. ఒక జర్మను చనిపోయిన అయిదుగురు నిర్బంధితులు చంపబడుదురు. ఇన్ని జరుగుతున్నా బెల్జియనుల ధైర్యంమాత్రం తగ్గలేదు. చివరకు ధర్మమే విజయమొందునని నమ్ముచున్నారు.

## ఆల్సేసు.

ఆల్సేసు రాష్ట్రంలో జర్మను గవర్నరు ఎట్టి ఉత్తరువులు జారీ చేసెనో చూడండి :—

"1941 వ సం॥ ఏప్రిల్ 27 వ తేదినుండి, జర్మనీ భాష తెలిసియూ ఫ్రెంచిభాష మాట్లాడువారు వెంటనే అరెస్టు చేయబడి ఒక సం॥ కఠిన శిక్ష విధించబడుదురు.

"విదేశపు రేడియోవార్తలు వినువారు 2 నుండి 5 సంవత్సరములవరకు శిక్ష విధింపబడుదురు.

"జర్మనీకి ప్రతికూలంగా మాట్లాడేవారు ఉరితీయబడుదురు."

పై నేరస్థులను పోలీసువారుగాని స్పెషలు పోలీసుగాని, యూనిఫారము దుస్తులు ధరించిన పార్టీ సభ్యులెవరైనాగాని అరెస్టు చేయవచ్చును.

"పారిసులో పాతకాలపు పరిస్థితులు యిపుడు తెచ్చిపెట్టుట ఆక్రమిత ఫ్రాంసులో నాజీ అధికారుల మనస్థితి ఎట్లున్నదో తెల్పుచున్నది. ఫ్రాంసులో నానాటికి అభివృద్ధి చెందుచున్న క్రోధమును యిట్టి చర్యలవలన అణచివేయగలమని నాజీ అధికారులు తలంచుట పొరబాటు" అని ఒక అమెరికను పత్రిక వ్రాసెను.

## నార్వే.

నార్వేలోని క్విస్లింగు ప్రభుత్వం శాంతి చేకూర్చలేక పోయినందున నాజీ అధికారులు అసంతృప్తి చెందియున్నారు. జర్మనుల దారుణ హింసాకృత్యములు, వాటికి నార్వీజియనులు తిరుగబడుట నిత్యకృత్యమైనది. ఆ దేశంలో కార్మికోద్యమం పటుతరముగా నున్నందున కార్మిక సంఘములను నాజీలంగీకరింపక తప్పినదికాదు. నాజీ కమిషనరు ప్రజలకు యిష్టుడుకాడు కనుక తొలగింపబడెను. నార్వే సమ్మెదారులు పెక్కుండ్రు విడుదల చేయబడిరి. నార్వీజియనులు చాల ఐకమత్యంతో బలంగా నుండబట్టే నాజీ సైనిక దళమును పెంచవలసివచ్చెను. ముఖ్య నగరాలలో అరెస్టుల సంఖ్య ఎక్కువగుచున్నది. ఆస్లో విశ్వవిద్యాలయం ఛాన్సలరు డిస్మిసు చేయబడెను. జర్మను సైనికులు మర ఫిరంగులతోగూడ ముఖ్య నగరాల వీధులు కావలా కాయుచున్నారు.

## రుమేనియా.

రష్యాతో ప్రత్యేకంగా సంధి చేసుకోవాలని కోరినందున తనతోడి సేనానాయకులు 12 మందిని రుమేనియా డిక్టేటరు జనరలు ఆంటనెస్కూ చంపవలసివచ్చెను. రుమేనియాను జర్మనులు పీల్చి పిప్పి చేయుచున్నారు. జర్మనులు ఆయుధకవచంగల మోటారులలో పోయి యుద్ధం చేస్తుండగ రుమేనియనులు కాలినడకను పోవలెను. యుద్ధరంగము నుండి గాయపడిన జర్మను సైనికులను మోటారులపై ఆస్పట్రియా తీసుకపోయి భద్రంగా ఉంచుతున్నారు. గాయపడిన రుమేనియను సైనికులను మాత్రం రయితుల ఎద్దు బండ్లలోను, లేదా కాలినడకనే తెచ్చుచున్నారు. దక్షిణ రంగమున రుమేనియనులు చాల బాధలు పడుతున్నారు. ఇంకా యెక్కువ సైనికులను రష్యని జర్మనులు కోరుచున్నారు. పెర్సీ క్లార్కు అను 68 సం॥లు బ్రిటిషు ఇంజనీరు రుమేనియాలో నున్నవాడు పడిన బాధలనుగూర్చి జిబ్రాల్టరు బిషపు రెవరెండు హెరాల్డు బక్లెసుగారు యిట్లు తెలిపిరి :—

"నే నతని కైరోలో చికిత్స నొందుచుండగా చూచితిని. అభివృద్ధి నొందుచున్నాడు. ఐరను గార్డు సైనికులాతన్ని పెట్టిన కష్టాలగూర్చి అతడు నాకు పూర్తిగ తెలిపెను. అతన్ని వెనుదిరిగి నిలుచోమని తలపై ఆపిలుపండుంచి సిపాయిలు రివాల్వరు గుండ్లు ప్రేల్చేవారు. వారు మంచి గురిగలవారగుటచే అతనికేమి అపాయం కలుగలేదు. తరువాత అతన్ని తలక్రిందుగ కాళ్ల మీదుగ వ్రేలాడగట్టి జోడులేని పాదాలపై చర్మం వచ్చేటట్లు కొట్టిరి. బుకారెస్టులోనున్న బ్రిటిషురాయబారి జనరలు ఆంటనెస్కూగారివద్దకు పరుగెత్తుకపోయి అతన్ని విడచేవరకు కదలనని భీష్మించుక కూర్చునివిడిపించెను."

## యుగోస్లావియా.

యుగోస్లావియాలో గోరిల్లా సైనికులు యింకను జర్మనులకు ఎదురు తిరుగుచునే యున్నారు. క్రోషియా రాష్ట్రంలో అనేకమంది ఉరిశిక్ష విధించబడిరి. వారు అధికారులవద్ద హాజరుకాకుండుటే నేరం. జాగ్రెబునందు సెంట్రలు పోస్టాఫీసునందు బాంబు ప్రేల్చిన కుట్రతో సంబంధము ఉందనే నెపముతో పెక్కుండ్రు ఉరితీయబడిరి వారిలో 50 మంది యూదులు కాల్చి చంపబడిరి.

## గ్రీసు.

గ్రీసును నాజీ సంకెళ్లనుండి తప్పించాలను ఉద్యమం బలమగుచున్నది. అచట జర్మను, ఇటలీ సైనికులు చాల అమానుషంగా ప్రవర్తిస్తున్నారని వర్ణింపబడుచున్నది. ఏథెన్సు నగరంలో గోడలపై వ్రాయబడియున్న ఆర్.ఎ.ఎఫ్. అను అక్షరములను ఆ దారి పోవువారంతా నాలికలో నాకి చెరుపవలెనని నిర్బంధింపబడుచున్నారు. అందువల్ల ప్రజలు అమితంగా మండిపడుట సహజం. నాజీ అధికారుల కీలుబొమ్మలుగ నున్న సొలకొగ్లుగారపైన, వారి మంత్రులంపైను ప్రజల కమితద్వేషం.

## చియాసు దీవి.

చియాసుదీవి ఈజియన్ సముద్రంలో ఏషియా మైనరు తీరానికి దగ్గరగనున్న గ్రీసువారి ద్వీపం. ఇపుడు దానిని జర్మను లాక్రమించిరి. అక్కడనుండివచ్చిన తటస్థ దేశీయుడు నాజీల దుర్నయాలు హృదయవిదారకంగా నున్నాయనియు, ప్రజలు చాల ఓర్పుతో సహించుచున్నారనియు, అయినా ఉరిశిక్షలకేనా యిష్టపడుచున్నారు కాని నాజీ వుత్తరువులను మన్నించుటలేదనియు చెప్పిరి.

"తమవద్దనున్న రాగి, అల్యూమినియం, మున్నగు లోహపు పాత్రలు, వంట సామానులు, నాణెములు పాలకులకు ఒప్పగించలేదను కారణమున ముగ్గురు స్త్రీలు, నల్గురు పురుషులు తుపాకులతో కాల్చబడిరి. 100 మంది జెయిలులో నుంచబడిరి.

"గ్రీసు దేశంలో ప్రజల తిరుగుబాటు ధోరణి రోజురోజుకు హెచ్చుచున్నది. గత వత్సరం ఆగస్టు 15 వ తేదిన గ్రీసు యుద్ధనౌక హెల్లీ ముంచబడినదని వార్షికోత్సవంనాడు వేలకొలది కరపత్రములు దేశంలో పంచబడినవి. అందు ఇటలీవారు "మీ తండ్రులను, సోదరులను, కుమారులను చంపి, మీ స్త్రీలను కొట్టిన దుర్మార్గు"లని వర్ణింపబడిరి."

# రష్యా యుద్ధం.

## బ్రిటను, అమెరికాల సహాయం.

## లెనినుగ్రాడు పట్టుబడునా?

## క్రిమియాలో ఒక్క జర్మనుకూడ కాలుపెట్టలేదు.

రష్యాపై జర్మనీ 15 వారాలనుండి యుద్ధంచేస్తున్నా 2,000 మైళ్ల పొడవు యుద్ధరంగంలోను రష్యను సేనలు జర్మను సేనలను ఎదిరించుచునే యున్నవిగాని ఒక్కచోటగూడ రష్యా రక్షణశ్రేణి శత్రువులచేత భేదింపబడలేదు. కొంత దేశభాగం గోల్పోయి, కొన్నిచోట్ల యుద్ధాలలో ఓడినా రష్యనుల నిలువరించుకొనే శక్తి తగ్గలేదు. ఈ మహాయుద్ధమునందు లక్షలకొలది సిపాయిలు పాల్గొంటున్నారు.

కాని రష్యను నాయకులకు కష్టాలు లేవన వీలులేదు. చలికాలం పూర్తిగా వచ్చేలోగా రష్యా సైన్యాన్ని ఓడించాలని జర్మనులు కాలానికెదురుగా పోరుచున్నారు. ఈయేడు చలికాలం రష్యాలో అదికిముందే వచ్చుట జర్మను ప్రభుత్వానికి మరీ ఆందోళనం కలిగిస్తున్నది. రష్యనులు తగులపెట్టి మసిచేసిన భూమిగుండా 500 మైళ్ళదూరం జర్మను సైన్యాలకు సప్లైలు అందజేయడానికి జర్మను లెంతో పెట్రోలు వృథాచేసుకోవలసివస్తున్నది. ఇంతాచేసి ఓడితే యీ శ్రమంతా వృథా అవుతుంది. అందుచే యుద్ధం కొనసాగించక యిపుడు జర్మనులు వెనుకకు పోలేరు. తమ శక్తినంతా వృథాచేయక తప్పదు. ఇంతా వృథాచేసైనా, రష్యను సేనలకు కాకసను ప్రాంతాల బొగ్గు, చమురు రాకుండాచేసి వారినికూడా మాడ్చాలని జర్మనుల ఉద్దేశం. రష్యనుల యుద్ధపరికరాల సంపదను కొంతవరకే వృథాచేసి, మిగిలినది ఉండనిచ్చినచో, యీలోగా అమెరికా బ్రిటనుల సహాయంకూడా చేరి, చలికాలం పోయినతరువాత, వసంతకాలంలోకూడా రష్యాను జర్మనీ ఓడింపజాలదు.

జర్మను లెంతవరకు తమ కార్యం నెరవేర్చుకో గలిగిరి? జర్మనులు మూడోసారి ప్రారంభించిన దాడిలోని జోరు రష్యను తిరుగు దాడులవలనగాని, చలిబాధచేగాని తగ్గలేదని చెప్పవచ్చును. ఆధునిక యుద్ధపరికరాలు రష్యా మంచు నిరోధమునుకూడ అతిక్రమించ కల్గుతున్నాయి. అందుచే సోవియటు రష్యా సైన్యానికి కష్టం తగ్గదు. రష్యా యుద్ధం చాలా దొడ్డది. యిదివరకు యుద్ధాలలో పెద్ద తీవ్ర సంఘటనలుగూడ యీ యుద్ధంలో స్వల్పమయినవిగా కన్పట్టును. అందుచే, సంగ్రహంగా చెపితే పొరబాటు అభిప్రాయాలు కలుగుటకు అవకాశం కలదు.

### లెనినుగ్రాడు ముట్టడి.

రష్యనుసేనానియగు మార్షలు వరషిలావుగారి సేనలు లెనినుగ్రాడును ముట్టడించిన జర్మను సేనలను ఎదిరించినిలువరించుకొనుటేగాక, తిరుగుదాడులనుకూడ చేసి, ఇల్మెను సరస్సునకు దక్షిణమున జర్మను సేనను వెనుకకు నెట్టెను. ఉత్తరమున ఫిన్లండు సేనలుకూడా అలసిపోవుచున్నవేగాని చెప్పుకోదగ్గ విజయం యేమి పొందలేదు. కావున బాల్టికు సముద్రతీరమునందున్న లెనినుగ్రాడు రక్షణయుద్ధపు దాణములో ముఖ్యఘట్టంగానుంది. ప్రత్యక్షంగా దాడిసలిపి ఆ నగరాన్ని వశపరచుకోవడం అసాధ్యమేమో అనిపిస్తున్నది. ఎంతకాలం అందున్నవారు బయట సంపర్కంలేకుండా సప్లైలు సరిపెట్టుకొని ముట్టడిస్థితిలో నుండగలరాయని సందేహంగావుంది. బహుశ ఇతరరంగాలలో యుద్ధాలను బట్టే యీ నగరభావిస్థితి నిర్ణయింపబడగలదు.

### మధ్యరంగం.

మధ్యరంగమునందు రష్యాసేనాని మార్షలు టిమొషంకోగారి తిరుగు దాడులు బాగా సాగుతున్నాయి. యల్నియా ప్రాంతాలందు రష్యనులు గోల్పోయిన ప్రాంతాన్ని తిరిగి ఆక్రమించేరు. కాని యీ సామాన్యవిజయాన్ని పెద్ద విజయంగా మార్చడానికి తగినంత విశేషసైన్యాన్ని రష్యను లిచట చేకూర్చగలరని యిపుడపుడే చెప్ప వీలులేదు.

### దక్షిణరంగం.

దక్షిణరంగమునందు నిజంగా రష్యనులస్థితి గడ్డుగానే యుంది. ఉక్రేనులో కీవునగరం పడిపోవడం చాల గొప్ప నష్టమే. అక్కడనుండి, రష్యా ధాన్యపు కొట్టనబడు ఉక్రేనురాష్ట్ర కేంద్రమగు కార్కోవు నగరానికి జర్మనులు పోవుటకు మధ్య ఏమి అడ్డులేదు. తూర్పు యుక్రైన్ను, డెనిట్జిలోయ యందలి పరిశ్రమలనూ కాకసను చమురుగనులకు ద్వారంవలెనున్న క్రిమియాను ఆక్రమించుటకే నీపరు నదిని జర్మనులు అనేకచోట్ల దాటి దాడి ప్రారంభించిరి. కీవునగరం తూర్పున మార్షలు బుడ్నిగారి సేనను నాశనం చేసితిమని జర్మనులు గొప్పలు చెప్పుచున్నను అతను తన సేనను కార్కోవు నగరానికి దిగువనే సమకూర్చెననియు, ఆ నగరం జర్మనులవశంకాకుండ అడ్డగలడనియు తెలియుచున్నది. ఇక ఒడెస్సా నగరం జర్మను, రుమేనియను సమిష్టి సేనలముట్టడిని బాగాఎదిరించి, యింకను పడిపోక దిట్టముగనేయున్నది.

### జర్మనుల దుస్థితి.

జర్మనులు వేగం యుద్ధముగించాలని అతి తొందరపడుచున్నారు. క్రిమియా ద్వీపకల్పమునందు వారి బాంబరు విమానాలు రష్యను సేనలకు వెనుకభాగాన చాల నాశనం చేస్తున్నా, జర్మనుల కాల్బలంమాత్రం ప్రికోపు భూసంధిదాటిపోలేదు. క్రిమియాలో ఒక జర్మను దేశీయుడైన యింతవరకు కాలు పెట్టలేదు. నల్లసముద్రంమీదుగా కాకసను ప్రాంతాలపైకి దాడిపోవాలని జర్మనులు యత్నిస్తున్నారనుటకు సందియంలేదు. కాకసను ఆక్రమించి రషియనుల చమురు సప్లయి త్రెంచివేసి, తాము తీసుకోవాలని, ఇరాకు, సిరియా, ఇరానులందు తమ కుట్రలు సాగనందున పోయిన ప్రతిష్ఠ తిరిగి నిలుపుకొనుటకును, లిబియాలోనున్న బ్రిటిషు సామ్రాజ్య సేనలను అక్కడనుండి మరల్చుటకును యీ కార్యం తలపెట్టిరి. కాని మార్షలు బుడ్నిగారి సైన్యం జర్మను సైన్యానికి ప్రక్కగానుండి దెబ్బకొట్టుచున్నంతసేపు కాకసను దాడి కష్టమయినదే. అందుకనే జర్మనులు నీపరు నదిదాటి క్రిమియాలోని సిబాస్టపూలు నౌకా శిబిరాన్నాక్రమించాలని అన్నివిధముల ప్రయత్నించుచున్నారు. నల్లసముద్రంలో రష్యా నౌకాదళం బలంకలిగి యున్నంతకాలం ఆతీరాలకు జర్మనులు పోలేరు. అందుకు ఇటలీ నౌకాదళం సహాయంపొందాలి అదివచ్చుటకు డార్డనెల్సు జలసంధి ద్వారా టర్కీమార్గం యివ్వాలి. అందుకు టర్కీ అంగీకరించే సూచనలగుపడవని జనరలు వావెలు సేనాని తెలిపెను.

### టర్కీ బల్గేరియాలపై ఒత్తిడి.

టర్కీపై జర్మనులు చాల ఒత్తిడి కలిగించుచున్నారు. రష్యా యుద్ధరంగానికి సైన్యాన్ని పంపమని బల్గేరియా

ప్రభుత్వాన్ని బలవంతపరుస్తు వర్నా బర్గోసు అను నల్ల సముద్రంలోని బల్గేరియా రేవుల రక్షణ యేర్పాటుచేయు చున్నారు. డార్డినెల్సు జలసంధిద్వారా ఇటలీ స్టీమరులకు టర్కీ దారియివ్వకపోతే, వాటిని బల్గేరియాకు అమ్మివేసి, బల్గేరియా తటస్థదేశం కనుక వారివిగామార్చబడు నౌకలకు దారియిమ్మని టర్కీని జర్మనీ కోరుచు; అటువంటి మోసనికి టర్కీ ప్రభుత్వం లొంగిపోదు. బల్గేరియాను తటస్థదేశంగా అంగీకరించమని ఇంగ్లాండు రష్యా ప్రభుత్వములు అపుడే చెప్పినవి. ఇపుడు టర్కీ జర్మనీ ఒత్తిడిని త్రోసివేసి ఎదిరించుటకు ఎట్టి అభ్యంతరంలేదు. బ్రిటను రషియా సేనలు టర్కీకి సహాయంచేయడానికి సరిహద్దులలోనే సిద్ధంగా వున్నాయి.

రషియాను ఏవిధంగానైనా గెలిపించుట ఇంగ్లాండునకే శ్రేయస్కరమని రుజువుచేయుచు చర్చిలు ప్రధాని యీ వారం కామన్సు సభలో స్పష్టంగా తెలిపియున్నాడు. "మాస్కోలో మూడు రాజ్యాల ప్రతినిధులు సమావేశమయినారు. నెల నెలకు ఎంతెంత సహాయం తాముచేయగలరో వారికి తెలుసును. నెలవారీగా సప్లయిలు ఎంతెంత రాగలవో రష్యా ప్రభుత్వం తెలుసుకొనుట అవసరం. అపుడే వారు తమ సరంజామును వృథాకాకుండా బాగా ఉపయోగించుకోగలరు. తాము నష్టపోయిన ఆయుధ సంఖ్యకు చెడిపోయిన ఉత్పత్తి శక్తికిని, బ్రిటిషు-అమెరికాలనుండి ఎంత సప్లయి రాగలదో దానికినివారా అపుడే రషియనులు తెలుసుకోగలరు" అని చర్చిలుగారు తెలిపిరి.

రష్యాకు ఇప్పటికే చాల సహాయం వెళ్లింది. విమానాలకు చమురు, ఇంగ్లాండులో ఒక వారంలో తయారయిన టాంకులన్నీ, రాయలు విమానదళంలో ఒకభాగం అపుడే రష్యా యుద్ధరంగములు చేరెను. రష్యాకు సహాయం చేయడంలో ఇంగ్లాండు-అమెరికాలు ఎంత ఖర్చయినా లక్ష్యంచేయవు. ఎటువంటి సరకులు కావాలో వాటి పంపే విధానమేమిటో మున్నగు వివరాలన్ని యిపుడు మాస్కోలో జరుగుచున్న మూడు రాజ్యాల సభయందు నిర్ణయింపబడతాయి. ఉత్తరాన మార్మాంస్కు రేవు జర్మనులవశం కాలేదు. కావున ఆతట్టును, దక్షిణమున ఇరానుద్వారాను రషియాకు బ్రిటిషు-అమెరికను సప్లయిలు యికముందు అతివడిగా చేరగలవు.

మన సేనాధిపతి జనరలు వావెలుగారు బ్రిటిషు మంత్రివర్గంతో లండనులో సంప్రదించి, తిరిగి వచ్చుత్రోవలో ఇరానులోని రషియను సేనాధిపతితోను, మధ్య ప్రాచ్యమున బ్రిటిషు సేనాధిపతియగు సర్ ఆచినులెకుగారితోను సంప్రదించి వచ్చిరి. బ్రిటిషు సహాయసైన్యం రషియా దక్షిణ రంగానికి పోవాలని ప్రజలు కోరుచున్నారు. కాని అందున్న కష్టనష్టాలేమిటో, ఎపుడు పంపాలో ఉన్నతాధికారులకు తెలుసును. ఇపుడు ఇరానుతో బ్రిటను రషియాలు క్రొత్తసంధి చేసుకున్నవని చర్చిలు ప్రకటించినందున, యికముందు పర్షియా ప్రజలు యీ యుద్ధంలో మనపక్షం ఉండగలరు. పర్షియనుగల్ఫు ఇరానులద్వారా విశేషంగా సహాయం రషియాకు చేరగలదు.

# చర్చిలు ప్రధాని యుద్ధ సమీక్ష.

## వసంతకాలమున తీవ్ర యుద్ధం జరుగునను సూచన.

## ఇరానుతో రష్యా, బ్రిటనుల క్రొత్త ఒడంబడిక.

బ్రిటిషు ప్రధాని చర్చిలుగారు యీ మంగళవారంనాడు పార్లమెంటు సభలో యుద్ధక్రమంగురించి ఉపన్యసించిరి. యుద్ధక్రమంగూర్చి ఆలోచనలగూర్చి తరుచూ బయటకు చెపుతూ వుండరాదనియు, హిట్లరు ఏడు నెలలనుండి ఎట్టి ఉపన్యాసం చెయలేదనియు చెప్పిరి. ఫిబ్రవరిలో అతడు జలాంతర్గాముల యుద్ధం తీవ్రంగా జరుగగలదని సూచించియుండుటచే మనం తగు ప్రతి చర్యగైకొని ఎక్కువ నష్టం లేకుండా చేసుకొనగల్గితిమనియు చెప్పిరి.

జూలై, ఆగస్టు, సెప్టెంబరు మాసములలో బ్రిటిషు మిత్రమండలి నౌకా నష్టములు ఏప్రిల్, మే, జూన్ మూడు మాసములలో దానికి మూడో వంతనియు, యీ కాలమునందు జర్మనులకు మనం కలుగజేసిన నౌకా నష్టం 1½ వంతున పెరిగిందనియు తెలిపిరి. బ్రిటనులో ఆహారం నిలువ యిదివరకటికన్న ఎక్కువగ నుందనిరి.

### ఒంటరిగ లేము.

"ప్రోత్సాహకరమగు ఒక విషయం చెప్పగలను. ఏడాది క్రిందటవలె యిప్పుడు మనం ఒంటరిగ లేము. కాలం గడచిన కొలది మన స్థిరమైన నడవడియు, శత్రువులయొక్క క్రూరచర్యలును మరి రెండు గొప్ప రాజ్యాలను మనకు అతి సన్నిహితమొనర్చి, మనతో కలసి పనిచేయునట్లొనర్చినవి. అత్యంత శ్రద్ధతో యుద్ధం చేయుచున్న రష్యను సేనలను చూచినా అమెరికా సంయుక్త రాష్ట్రముల గంభీరదీక్ష కృషి చూచినా మనం తృప్తిపొందగలం. ఒంటరిగా వున్నా విసుగు వేసటలేక యీ పోరాటం సాగించవలసిందే. యిపుడు మనం ఒంటరిగా లేము." అని చర్చిలుగారు తెలిపిరి. పత్రికలలో ముందు చర్యలగూర్చి చర్చిస్తూ వుంటారు గాని వాటినిగూర్చి మంత్రులేమీ చెప్ప వీలులేదనిరి. హిట్లరు రష్యాపై యుద్ధంలో మునిగి తేలుచున్నపుడే బ్రిటను పశమట యూరోపుపై దాడి చేయరాదా యని కొందరు ప్రశ్నింతురు. ఆ విషయం అధికారులకుగూడ తోచియుండును. కాని ఆ విషయం అవుననికాని కాదనికాని యిపుడు చెపితే శత్రువు తప్ప యింకెవ్వరు లాభం పొందరు. శత్రువు తన రహస్యాలను చెప్పడు. హిట్లరు రష్యాయొక్క విశాల రాజ్యంలో ఎంతవరకు చొరబడనుద్దేశించెనో, యిపు డాక్రమించిన ప్రయోజనకరమగు భూమిని వుపయోగించుకొని, తన అపారమగు సైన్యాలను నైరుతి దిక్కున నైలునది ప్రాంతాలకు మరల్చునో, పడమరను స్పెయినుమీదుగా ఉత్తరాఫ్రికాకు మరల్చునో లేక తాను ప్రత్యేకంగా నిర్మించిన నావలనుపయోగించి బ్రిటనుపై దండెత్తడానికే వస్తాడో, ఏమో ఎవరికి తెలుసు. ఈ మూడు ప్రమాదకరమగు కార్యాలు ఒకేసారి చేయడానికిగూడ అతనికి శక్తిగలదు. శత్రువునకు ఆకాశమార్గమునందే పెద్ద లోటు వున్నది. ఇతర విషయాలలో అతనికే ఉపక్రమణ శక్తి వున్నదనిరి.

రష్యాకు సహాయంగూర్చి తెల్పుచు, ఇప్పటినుండి ప్రతి నెల రష్యాకు యెంతసహాయం యివ్వగలమో పూర్తిగ తెలుసుకొనియే, మాస్కో సభయందు బ్రిటిషు రష్యా ప్రతినిధులు పాల్గొనుచున్నారనియు, రష్యా శ్రేష్టతమంగా యెంత కాలమయినా పోరాడగల్గియుండుటకుగాను బ్రిటిషు ప్రజలు చాల గొప్పత్యాగంచేసి, ఆయుధాలు విమానాలు వుత్పత్తి చేయాలనియు, అమెరికాలో క్రొత్త యంత్రాలయాలు నిర్మించాలనియు, చర్చిలుగారు తెల్పిరి. అట్లాంటికు సముద్రం నుండి తాను రూజువెల్టు కలిసి స్టాలినుకి సందేశం పంపినప్పటి నుండి సముద్రం యిరువైపులా రష్యాకు సహాయంచేయుటకై విధి విరామంలేకుండా పని జరుగుతున్నదనిరి.

బ్రిటిషు సైన్యంగూర్చి కొందరి విమర్శలకు ప్రత్యుత్తరంగా తెల్పుచు, యూరోపు ఖండంలో సైన్యాలతో పోల్చతగినంత

ఇది సెంటు పాల్సు అను క్రైస్తవ దేవాలయము.



ఈ దేవాలయము లండను పట్టణములో వున్నది. ఇది ప్రసిద్ధికెక్కిన కట్టడము. ఈ మధ్య జర్మన్లు రాత్రిపూట లండను పట్టణముపైన విమానదాడిచేసి బాంబులు వేసిరి. ఒక బాంబు యీ కట్టడముమీదపడి కొంతభాగము కూలినది. ఇట్టివే జర్మను రాక్షసులు చేసే ఘనకార్యాలు.

---

సైన్యం ఇంగ్లాండులో వుండలేదు, ఉండదనిరి. చాల శ్రమపడి యిపుడు మధ్యరకం సైన్యం తయారుచేయబడి రెండేండ్లు మంచి శిక్షణ యొసంగబడినది. జర్మను సైన్యం అంత లేకున్నా, వారి అనుభవం వీరికి లేకున్నా బ్రిటిషు సైన్యము, మరి 20 లక్షల సాయుధ దేశ రక్షకుల సహాయంతోకూడా, శత్రు సైన్యాలు ఇంగ్లాండుపైకివస్తే తిరుగగొట్టి సముద్రంలో త్రోయగలవనిరి. కావున యీ సైన్యాన్ని తగ్గించుటకు వీలులేదు. సైన్యం చిన్నదికాబట్టి దానికి ఆయుధబలం మెండుగనుండాలి. అందుచే నేర్పరులగు పనివారిని ఇంగ్లాండు నుండి పంపివేయరాదు. ఈ సైన్యానికి శత్రువుతో టాకా యేర్పడకపోయినాకూడా, కలుగుచుండు తరుగుదలను భర్తీ చేయుచుండుట అవసరము. ఎపుడో ఒకనాడు బ్రిటిషు జాతి రక్షణభారమంతా యీ సైన్యంపైనే పడవచ్చుననిరి. రోము నగరంపై బ్రిటిషు విమానాలు యెందుకు దాడిచేయ లేదను ప్రశ్నకు బదులుచెప్పుచు, యింకా కైరో నగరంపై బాంబులు పడలేదు కనుక రోముపై బాంబులు వేయలేదనియు, యుద్ధక్రమాన్ని బట్టి సుళువుచూచుకొని రోముపై దాడి జరుపుటకు వెనుదీయమనియు చెప్పిరి.

### పెర్షియాతో క్రొత్త సంధి.

పెర్షియాలో బ్రిటిషు ప్రభుత్వ చర్య చాల జయప్రదంగా జరిగింది. ఏమాత్రం జననష్టంలేకుండా అతి త్వరగా రష్యను మిత్రులతో కలసికట్టుగా పనిచేసి, టెహరానులో నిరంకుశ పాలకుని ప్రవాసానికి పంపగలిగితిమి. చిరకాలంగా జరుగ వలసిన సంస్కరణల చేస్తానని మాటయిచ్చిన చట్టబద్ధుడ యిన రాజును నెలకొల్పినాము. ఇదివరకు చేసిన చర్య లను ఆమోదించుచు, పర్షియా మిముక్తినందేగాక, ముందు యుద్ధం కొనసాగించు చర్యలందుకూడ పర్షియను ప్రజలు తోడ్పడులాగున ఏర్పాటుచేయబడిన క్రొత్త ఒడంబడిక, బ్రిటను రష్యాలు పర్షియా ప్రభుత్వంతో చేసుకొన్నది. త్వరలో అది పార్లమెంటు ఎదుట పెట్టగలనని చర్చిలు ప్రధాని తెలిపెను.

"బ్రిటిషు ప్రజలను ఓదార్చడానికి ఆశలనుగాని, నిర్భ యంగా నుండవచ్చని గారంటీలుకాని యివ్వలేను. చలి కాలం వచ్చినందువలన శత్రువుల ఒత్తిడి తగ్గుననుకోరాదు. చలికాలపు పొగమంచులో ప్రమాదాలు లేకపోలేదు. శత్రు వుకి యంత్రసన్నాహం చేయడానికి కావలసినంత వ్యవధి వుండెను. వచ్చే వసంతకాలంలో యింతవరకు ఎరుంగ నంత తీవ్రయుద్ధం తూర్పున జరుగునని ఎంచవచ్చు. బ్రిటిషు దీవిపైగూడా దండయాత్ర జరుగవచ్చును. నేటి యీ జగ న్నాటకంలో మన పాత్రను మన సాంప్రదాయసిద్ధమగు పట్టుదలతో ఏకాగ్రతతో చక్కగ నిర్వహించవలెను. అతి తీవ్ర కృషి జరుపవలెను" అని చర్చిలుగారు నుడివిరి.

# టొబ్రుకును రక్షించిన భారతీయ సైన్యం.

## 18 వ కావల్రీ రెజిమెంటు సేనాని ప్రశంసల పొందుట.

ఇటలీవారిదగు లిబియా రాష్ట్రమునందు ఉత్తర ఆఫ్రికా తీరమునందున్న ముఖ్యరేవు స్థలం టొబ్రుకు. ఈ నగరాన్ని ఆక్రమించి, ఐదునెలలపాటు శత్రువులదాడిని తరుముగొట్టి, చుట్టూప్రాంతం అంతా శత్రువశమైనా దీనిని మాత్రం వదలకుండా రక్షించిన 18 వ భారతీయ కావల్రీ రెజిమెంటు, కొద్ది రోజుల క్రిందటనే విశ్రాంతికై ఈజిప్టు దేశానికిపోయెను. అచట బ్రిటిషు సేనాని సర్ క్లాడు అచినులెకుగారు ప్రత్యేకంగా ఆ సైనికులందరిని చూడవచ్చి, వారి కృషిని కొనియాడిరి. సైనికులు ఎట్టి అలసటలేక, తిరిగి యుద్ధానికి సిద్ధంగానున్నట్లగుపడిరి. ఇటలీవారి చేతులలోనుండి కొద్ది రోజులలోనే టొబ్రూకును వీరు వశపరచుకొని యింతకాలం రక్షించగల్గిన ఘన కార్యమును ప్రపంచమంతా శ్రద్ధతోచూచి కొనియాడిందని సేనాధికారి వారికితెలిపెను.

బెంగాజినుండి వెడలిపోవుచున్న బ్రిటిషు ఆస్ట్రేలియను సైన్యములను అడ్డుకొని చెదర గొట్టుటకు జర్మను ఇటలీ సేనలు ప్రయత్నింపగా యీ భారతీయ సేనయే శత్రు ఫిరంగులపైబడి అణచివేసి తమ సామ్రాజ్య సేన తప్పించుకొనుటకు అవకాశం కలిగించెను. తరువాత యీ దళం టొబ్రూకులోనున్న తమ సైన్యాన్ని చేరగలిగెను.

టొబ్రూకులోని సైనికదళం ఘన కార్యాలగూర్చి ఎంతో ఎక్కువగా చెప్పబడింది, అందేమి అతిశయోక్తి లేదు. ప్రతి రాత్రి దాడి జరుగుతూవుండేది. సైనికులు సేనానాయకులు గూడ సర్వదా సిద్ధంగానుండి అలసియున్న శత్రువునకు తెలియకుండా క్రొత్త దెబ్బ కొట్టుటకు ఉపాయం ఆలోచిస్తూనే వుండేవారు.

18 వ కావల్రీ రెజిమెంటులో కొంకణులు, రాజపుత్రులు జాట్లు వున్నారు. వారంతా శత్రువుకన్న తాము శక్తివంతులమని ఆత్మవిశ్వాసం కలిగి సర్వదా నవ్వు ముఖాలతో వుంటారు. వినోదంగా తాము చేస్తున్న యీ టొబ్రూకు రక్షణకార్యం యింకొకరికి విడువవలసి వచ్చిందేయని ఆశాభంగం చెందినట్లగుపడ్డారు. టొబ్రూకు వద్ద సముద్ర స్నానం కులాసాగాయుంటుంది. నీరంత మంచిదికాదు. శత్రువుల చర్యలు యీ సైన్యానికి కొంచెం చీకాకు కలిగించే విధాని అంతకన్న ఎక్కువ కష్టపెట్టలేదు. శత్రువు ఆ నగరంపై విశేషంగా మందుగుండు వృథాగా వెచ్చించెను. ముట్టడిచేసేవారెవరో ముట్టడింపబడిన వారెవరో పోల్చ వీలులేనట్లుగ టొబ్రూకు యుద్ధం జరిగింది. అచటున్న బ్రిటిషు, ఆస్ట్రేలియను, ఇండియను సైనికదళాలలో ప్రతి ఒక సైనికుడు యితరులతో కలసి మెలసి తిరుగుచు శత్రువును వెంటాడుటయందు పోటీపడేవారు. ఈ భారతీయదళం తమ బసలలో చాల కులాసాగా కాలం గడి[illegible] చివచ్చిన ఒకరు తెలిపిరి.

# ఈ వారంలో యుద్ధ వార్తలు.

### విమాన దాడులు.

సెప్టంబరు 24 వ తేది బుధవారమునాడు వాతావరణము అనుకూలముగ లేకపోయినను బ్రిటిషు విమానములు, శత్రు నౌకలపై దాడుల సాగించుచునేయుండెను. నార్వే సమీపమున ఫ్రెంచి తీరమునకు సమీపమునను ప్రయాణ మొనర్చుచున్న శత్రు నౌకలను యెదిర్చి చాల బాంబులవేసినవి. 26 వ తేది మధ్యాహ్నము బ్రిటిషు విమానములు ఫ్రెంచి కోస్తాకు సమీపమున మందు గనులను తుడిచివేయు శత్రు నౌకలను నాల్గింటిని; రెండు విమానధ్వంసక నౌకలనుగాంచి వానినెదిర్చెను. మందు గనుల తుడుచు నౌకలలో రెండు పూర్తిగ తగులబడిపోయెను. విమానధ్వంసక నౌకలన్నింటికి దెబ్బలు తగిలెను. కొన్ని రోజులుగా యీ దాడులు తగ్గింపబడెను. కాని, మరల బ్రిటిషు విమానములు శుక్రవారము రాత్రిమరల ఫ్రాన్సు, జర్మనీలపై విమాన దాడుల సాగించెను. ఫ్రెంచి కోస్తా రేవులపైవేసిన బాంబుల భయంకరమగు ప్రేలుడు ధ్వనులచే, బ్రిటిషు కోస్తాయందలి పట్టణములోని భవనములుగూడ కదలిపోయెను. జర్మనీయందు నైరుతి ప్రాంతమందలి పట్టణములపైన గూడ చాల బాంబులుపడెనని జర్మను లంగీకరించిరి. శనివారం నాడు ఫ్రాన్సు ఉత్తర ప్రాంతమున గల విమియన్సు మొదలగు పారిశ్రామిక పట్టణములపై బ్రిటిషు విమానములు చాలబాంబులు వర్షించెను. ఈ దాడులలో 11 శత్రు విమానములు పడగొట్టబడెను. 7 బ్రిటిషు విమానములు తిరిగిరాలేదు. శనివారము మధ్యాహ్నము చాలవిమానములు ఫ్రాన్సుపైకి జని అమియన్సు మొదలగు రైల్వేకూడలి ప్రదేశములపై వేలకొలది బాంబులు వర్షించెను. ఈ దాడులలో 13 విమానములు నష్టమయ్యెను. 21 శత్రు విమానములు ధ్వంసమొనర్పబడెను. ఆదివారము పగలు బ్రిటిషు విమానములు ఫ్రాన్సు ఉత్తర భాగముపై తీవ్రమగు దాడిని సాగించి, చాల రైలుమార్గములను ధ్వంసమొనర్చెను.

29 వ తేదీన బ్రిటిషు విమానాలు, జర్మనీపైననే గాక ఇటలీలో టురిన్ జెనోవా మొదలగు పది పట్నాలమీదగూడ తీవ్రమైన దాడులు సాగించినవి. టురిన్ లో చాల ఫ్యాక్టరీలు ధ్వంసమొనర్పబడెను. 30 వ తేదీ రాత్రి బ్రిటిషు విమానాలు బాల్టిక్ సముద్రప్రాంతమున జర్మను ప్రధాన నౌకా కేంద్రమగు స్టెట్టిన్ రేవుపై భయంకరమగు దాడిని సాగించి, రేవును చాల భాగము ధ్వంసమొనర్చెను. హాంబర్గునందలి రేవు ప్రాంతమును, ఫ్రెంచి తీరపు లిహావే చెర్బర్గ మొదలగు రేవులపైనగూడ వేలకొలది బాంబులు వర్షించెను.

బ్రిటనుపై ఈ వారము విమానదాడులు చాల తగ్గిపోయెను. 24, 25 వ తేదీలలో బ్రిటనుపై విమానదాడులే జరుగలేదు. 26 వ తేది రాత్రి స్వల్పముగ శత్రు విమానములు బ్రిటనుపైకి వచ్చి అక్కడక్కడ కొలది బాంబులవేసినవి. తూర్పు ఆంగ్లియాలో కొన్ని భవనములు కూలిపోయెను. కొలదిమంది ప్రజలకుగూడ దెబ్బలు తగిలినవి. 27 వ తేది రాత్రి శత్రు విమానదాడుల సంచలనము చాల తక్కువ. ఇంగ్లండు తూర్పు భాగంలో అక్కడక్కడ కొన్ని బాంబు పడినవిగాని, ప్రాణనష్టములేదు. కొన్ని ఇండ్లమాత్రము కూలిపోయినవి. ఆదివారం పగలు బ్రిటనుపై శత్రు విమానము లెచ్చటను కనుపింపలేదు.

28, 29 వ తేదీల రాత్రులలో గూడ, చాల తక్కువ శత్రు విమానములు మాత్రమే బ్రిటనుపై దాడివచ్చెను. 28 వ తేదీ దాడిలో రెండు ప్రదేశములలో కొన్ని భవనములు శిథిలమయ్యెను. కొందరు మరణించిరి. 29 వ తేదీన తూర్పు తీరపట్నాలమీద మాత్రమే అక్కడక్కడ బాంబులుపడెను. ఒక పట్టణములో కొంత జననష్టం, ప్రాణ నష్టం కలిగింది. మంగళవారం రాత్రి కొలదిగంటలసేపే అయినా, ఇంగ్లండు ఈశాన్య భాగంలో ఒక పట్టణం

మీద తీవ్రమైన దాడి జరిగింది. కొంతమంది మరణించిరి. ఒక శత్రు విమానం పడగొట్టబడెను.

## ఇటలీ, ఆఫ్రికా, మధ్యధరా.

టొబ్రూకునందును, ఈజిప్టు-లిబియా సరిహద్దులందును, బ్రిటిషు సైనికులు ఈ వారము శత్రుసైనిక పంక్తులపై చురుకుగ దాడులు సాగించిరి.

అబిసీనియాయందు బ్రిటిషు సైన్యములు గత ఏప్రిల్ 15 వ తేదినుండియు 'వాల్చకిట్' అను దుర్గమునందలి ఇటాలియను సైన్యముల ముట్టడించియుండెను. ఇటాలియను సైనికుల ఆహారపదార్థములు, మందుగుండు సామగ్రి అయిపోయినవి. అందుచే యుద్ధముమాని లొంగిపోవలసినదిగ ఇటాలియను సైనికులకు, ఇటలీ ప్రభుత్వము ఉత్తరువు గావించెను.

ఉత్తర ఆఫ్రికాయందలి బెంఘాజీ, ట్రిపోలీ రేవుల (ఇటాలియను)మీద బ్రిటిషు విమానములు 24 వ తేదిన బ్రిటిషు విమానములు తీవ్రమగుదాడి సాగించెను. బెంఘాజీరేవులో, బ్రిటిషు బాంబులచే ఒక పెద్ద నౌక ప్రేలి కొన్ని క్షణములలోనే మునిగిపోయెను. 25 వ తేదిన టొబ్రూకుపై శత్రులు స్వల్పముగ బాంబులువేసిరి. గాని విశేషమగు నష్టమును గలుగలేదు.

## టర్కీ, ఇరాక్, ఇరాన్.

టర్కీ శాసనసభ, దేశరక్షణ సన్నాహములకుగాను 570 లక్షల పౌనుల వెచ్చించుటకు 24 వ తేదిన అనుమతించెను. టర్కీ ప్రభుత్వము, అలెగ్జాండ్రియా, మెర్సిన్ రేవులలో నౌకాశ్రయముల నిర్మాణమునకు, బ్రిటిషు ఇంజనీయరింగు కంపెనీలకు కంట్రాక్టు నొసగెను. టర్కీకి, బ్రిటను విమానములను సప్లైచేయుటకు అంగీకరించెను వానిలో కొన్ని 24 వ తేదిన టర్కీకిచేరెను; అరువుకవులు చట్టముక్రింద, అమెరికా గూడ, ఫిరంగులు మున్నగు ఆయుధ సామగ్రిని సప్లైచేసెను.

ఇరాన్‌నుండి వెడలగొట్టబడిన 600 మంది జర్మనులు 28 వ తేదిన సరిహద్దులదాటి టర్కీని ప్రవేశించిరి.

23 వ తేదిన ఇరాన్ శాసనసభలో తీవ్రమగు చర్చ జరిగిన తరువాత మంత్రివర్గమునందు విశ్వాస తీర్మానము అధిక సంఖ్యాకులచే ఆమోదింపబడెను.

ఇరాన్ ప్రభుత్వమువారి కోరికమీద, బ్రిటిషు పటాలములు, రాజధానియగు టెహరన్ పట్టణ పరిసరముల ప్రవేశించి అచట ఒక వైద్యశాలయందు శిబిరముల నేర్పరచుకొనెను.

ఇరాన్‌లో రష్యను—బ్రిటిషు సైన్యములకు సంఘర్షణలు సంభవించుచున్నవను వార్తలు కేవలము అసత్యమని బ్రిటిషు అధికారులు ప్రకటించిరి.

ఇరాన్‌నుండి తిరిగి వచ్చుచున్న జర్మను, ఇటాలియను రాయబారులు, వారి సిబ్బంది, జర్మను స్త్రీలు పిల్లలు సెప్టంబరు 28 వతేదిన టర్కీలో ఇస్తాంబుల్ పట్టణమునకుచేరిరి.

మాజీ "షా" (ఇరాన్ రాజు)అగు రిజాఖాన్ పహ్లవీ గారు, అతని కుటుంబముతో సహా 28 వ తేదిన ఇరాన్ నుండి, దక్షిణ అమెరికాకు ప్రయాణమై వెడలెను.

జర్మనీకి వెడలియుండిన వాన్‌పేపన్ గారు (టర్కీయందలి జర్మను రాయబారి) ఆకస్మికముగ టర్కీకి తిరిగివచ్చెను. సోమవారమునాడితను, టర్కీ విదేశాంగ మంత్రియగు సారాజొగ్లును దర్శించి మాటలాడెను.

స్వతంత్ర ఫ్రెంచి నాయకులలో నొకరగు కాట్రూ సేనాని, సిరియాకు స్వతంత్ర ప్రభుత్వము నేర్పరుచు పద్ధతిని నిరూపించుచు 27 వ తేదిన సిరియా ప్రజలకు ప్రకటన గావించెను.

పేపన్‌గారు 30 వ తేదిన అంకారాకువచ్చి టర్కీ విదేశాంగ కార్యదర్శిని చూచి చాలసేపు సంభాషించిరి. టర్కీ-జర్మను వర్తక ఒడంబడిక సంప్రదింపులలో చిక్కులేర్పడుటచే ఆ విషయమై పేపన్‌గారు మాటలాడినట్లు తెలియుచున్నది.

బ్రిటిషు ప్రధాని చర్చిలు గత 30 వ తేదిన పార్లమెంటులో ప్రసంగించుచు, ఇరాన్ ప్రభుత్వము, మిత్రమండలియందుచేరి ఆక్సిసుపై యుద్ధమును సాగించుట కంగీకరింపవచ్చునని సూచించెను.

## అమెరికా-అట్లాంటిక్.

అమెరికా తాటస్థ్యశాసనమును రద్దుచేయవలెనని గోరుచు మెకెల్లరు అను సభ్యుడు, సంయుక్త రాష్ట్రముల సెనెటునందొక తీర్మానమును ప్రవేశపెట్టెను. తాటస్థ్య శాసనమును 1939 లోనే రద్దుచేసియున్నయెడల అసలీ యుద్ధమే సంభవించెడిదిగాదని రూజ్వెల్టు అధ్యక్షుడు "కాలియర్సు మేగజేన్" అను పత్రికయందు వ్రాసెను.

ఈ వారము, గాల్లపు పోలు పద్ధతిని ప్రజాభిప్రాయమును గనుగొనగా, సంయుక్త రాష్ట్రములలో నూటికి 56 వంతులు అట్లాంటికు పడమటి భాగమున జర్మను జలాంతర్గామిగాని, యుద్ధ నౌకగాని కన్పించినతోడనే ముంచివేయవలెనని రూజ్వెల్టు అధ్యక్షుడు ఇటీవలగావించిన యుత్తరువును బలపరచిరి. 36 వంతులు ప్రతికూలముగనున్నట్లు తెలిసది.

అరువుకవులు శాసనముక్రింద ప్రస్తుతము 27 బ్రిటిషు యుద్ధ నౌకలు సంయుక్త రాష్ట్రముల నౌకా నిర్మాణశాలలయందు మరమ్మతులు పొందుచున్నవి.

వ్యవహారములు ప్రస్తుత ప్రకారము సాగుచో, కొలది రోజులలోనే అమెరికా సంయుక్త రాష్ట్రములు స్వయముగ సంగ్రామమునదిగునని; ఫీల్డు మార్షలు స్మట్సుగారు ప్రకటించిరి.

27 తేదినొక్కమారుగ అమెరికా రేవులలో 14 నౌకల నిర్మాణము ప్రారంభింపబడెను. ప్రపంచ స్వాతంత్ర్య రక్షణకు నిర్మింపబడబోవు బ్రహ్మాండమగు నౌకాదళమునకిది ప్రారంభమని రూజ్వెల్టు అధ్యక్షుడు ఆసమయమున సందేశమొసగెను.

"ట్రినిడాడు" అను అమెరికను నౌక 27 వతేదిన అట్లాంటికు సముద్రమున, జర్మను జలాంతర్గామిచే ముంచివేయబడెను. ట్రినిడాడును ముంచుటకు, ఆజలాంతర్గామి సముద్రము పై భాగమునందుండి యేఫిరంగుల నుపయోగించెను.

"హిట్లరును, అతని ఉపగ్రహములగు ఇటలీ, జపానులను ఓడించడం అమెరికా సంయుక్త రాష్ట్రముల కృత నిశ్చయం. అటుతరువాత ప్రపంచంలో సుస్థిరమైన శాంతిని స్థాపించడము. ఇందుకు, బ్రిటను—అమెరికాలు సముద్రముపై ఆధిపత్యం నెలకొల్పుకొనుట అవసరం." అని అమెరికానౌకా శాఖ కార్యదర్శియగు కర్నలు నాక్సుగారుప్రకటించిరి.

## రష్యా.

లెనిన్‌గ్రాడు పరిసరముల ప్రవేశించితిమని జర్మను అధికారులు 24 వ తేదిన ప్రకటించిరి. కాని రష్యను అధికారులీవార్తను ధృవపరుపలేదు. లెనిన్‌గ్రాడు సమీపమున జర్మనులాక్రమించిన ఒక పట్టణమును, రష్యను సైన్యములు తిరిగి స్వాధీనపరచుకొని జర్మనుల వెనుకకు తరిమివేసెను.

మధ్యరంగమున యెల్నియా పట్టణముపద్ద మరి 10 గ్రామములను రష్యను సైన్యములు తిరిగిపట్టుకొనినవి.

ఈ మధ్య రంగమున (స్మొలెన్‌స్కు) రష్యను సైన్యములు 20 వేల జర్మను సైన్యమును హత మార్చి చెల్లచెదరు చేసి చాల ఆయుధ సామగ్రిని పట్టుకొనిరి.

యుక్రేన్‌లో, కీవునకు 120 మైళ్లు తూర్పుననున్న పొల్టవాను ఖాళీ చేసితిమని రష్యనులు ప్రకటించిరి.

రష్యాలోని కకేసియా ప్రాంతమును కాపాడుటకుగాను, భారతదేశపు సైన్యముల రష్యాకు పంపుటకు ఆలోచనలు జరుగుచున్నవి. ఈ విషయమై భారత ప్రధాన సేనానియగు వేవలుగారు, రష్యను సేనానులతో సంప్రదింపనున్నారు.

ఎంతయోదూరమున గల మందు గిడ్డంగులను ప్రేల్చివేయగల రహస్యమగు రేడియో ఆయుధ మొద్దిరాయ రష్యనుల వద్దనుండవలెననియు, లేనిచో, వందలకొలది మందు గిడ్డంగు లీవార మీవిధముగ గోల్పోయి యుండరనియు జర్మను సైనికాధికారు లాశ్చర్యపడుచున్నారు.

దక్షిణమున క్రిమియా ద్వీపకల్పముపై జర్మనులు 24 వ తేదీన సైన్యముల నడుపుటకు ప్రారంభించిరి. అక్టోబరు 1 వ తేదికి జర్మనులు క్రిమియాను రష్యా భూభాగముతో కలుపు పెరికోపు భూసంధియందు 7 మైళ్లు మాత్రముచొచ్చుకురాగల్గిరి.

రష్యా పోరాటము సాగించుటకుగాను సైన్యముల సప్లయి చేయవలసినదని హిట్లరు తన మిత్రమండలిని గోరెను.

రష్యాపై వెంటనే యుద్ధము ప్రకటించి సైన్యములను పంపనియెడల బల్గేరియాను జర్మను సైన్యము లాక్రమించునని హిట్లరు బల్గేరియా రాజు బోరిస్ కు శ్రీముఖము నంపెను.

30 వ తేదిన మాస్కోలో రష్యా, బ్రిటిషు, అమెరికా ప్రతినిధులు సమావేశమై సంప్రదింపుల ప్రారంభించిరి.

## దూరప్రాచ్యము.

చైనాలో జపాను సైన్యములు, హునన్ రాష్ట్రమున యింగ్టిన్ అను పట్టణమును 23 వ తేదిన పట్టుకొనిరని జపాను అధికారులు ప్రకటించిరి. జపాను సైన్యములు 26 వ తేదిన హునాన్ రాజధానియగు చంగ్షా నగరమును ఆక్రమించితిమనిరి. 30 వ తేదిన చాంగ్షాను తిరిగి ఖాళీచేసితిమని జపాను అధికారులు ప్రకటించిరి. జపానీయులు చాంగ్షా నాక్రమింపనేలేదనియు, ఆనగరమునకు ఉత్తరప్రాంతమున చైనా సైన్యములు పన్నిన వలలో లక్ష జపాను సైన్యము చిక్కుకొనెననియు చైనా అధికారులు ప్రకటించిరి.

సోవియటు రష్యా అధికారులు దూరప్రాచ్య సరిహద్దులకు లక్షలకొలది సైన్యములను చేర్చి కేంద్రీకరించుచుండిరని ప్రయాణీకులవలన తెలియవచ్చెను. రష్యాకు జపానుకు త్వరలోనే సంగ్రామము ప్రారంభమగునని చైనా అధికారులు తలంచుచున్నారు.

దూరప్రాచ్యమున బ్రిటిషు పాలిత దేశముల రక్షణ యేర్పాటులగురించి సంప్రదించుటకు 1 వ తేదిన సింగపూరులో బ్రిటిషు మంత్రియగు డఫ్ కూపరుగారి సమక్షమున ఆయా ప్రాంతముల బ్రిటిషుఅధికారుల సమావేశము జరిగెను.

జపాను—జర్మనీ, ఇటలీలతో గావించుకొనిన మైత్రి ఒడంబడికయొక్క ప్రథమ వార్షికోత్సవములు సెప్టెంబరు 25 వ తేదిన జపానులో జరుపబడెను.

అమెరికాయందలి జపానీయులను ఖాళీచేసితెచ్చుటకు జపానునుండి ఒక నౌకను పంపువిషయమై జపాను—అమెరికాతో సంప్రదించుచున్నదని జపాను అధికారులు తెలిపిరి.

జపాను అమెరికాలకు జరుగుచున్న సంప్రదింపులయందు చైనాకు నష్టకరమగు షరతులుండవని త్వరలో ఒక ప్రకటన గావింపవలసినదని చైనా జాతీయసంఘము రూజ్వెల్టు అధ్యక్షుని గోరెను.

జపానునందు నివసించుచున్న 873 ఆంగ్లేయులు అనుహి అను నౌకలో స్వదేశమునకు 24 వ తేదినబయలుదేరివెళ్లిరి.

రాయబార కార్యాలయోద్యోగులుదప్ప, యిరోపా దేశాలలోని జపానీయులనందరిని రాబోవునెల స్వదేశమునకు మరల్చుకొనివచ్చుటకు జపాను అధికారులు ఏర్పాటులు చేయుచున్నారు. భారతదేశమునందలి జపానీయులను స్వదేశమునకు మరల్చుకొనిపోవుటకుగాను జపాను అధికారులు ఒక నౌకను గతవారము పంపిరి.

ఫిలిప్పైను దీవులనుండి 350 మంది జపానీయులు యీ వారము. స్వదేశమునకు మరలిపోయిరి.

## ఆక్రమిత ప్రాంతములు.

జర్మను ఆక్రమణయందున్న జెకోస్లావియాయందలి "స్కోడా" ఆయుధనిర్మాణశాలలో పెద్ద ప్రేలుడు ప్రమాదము సంభవించెను. ఒక విద్యున్నిర్మాణశాలగూడ ప్రేలిపోయెను. వందలకొలది నాజీకార్మికులు మరణించిరి.

ఉత్తర ఫ్రాన్సులో జర్మనులమందుగుండు సామగ్రి గిడ్డంగిలోనుండి ఫ్రెంచి కమ్యూనిస్టులు ప్రేలుడుమందు సామగ్రిని యెత్తుకొనిపోయిరి ఒక జర్మను సైనికుల రైలుబండిని ప్రేల్చివేయుటకు కమ్యూనిస్టులు ప్రయత్నములు జరిపిరి. అందుచే జర్మను సైనికాధికారులు తామంతకుపూర్వము హామీగా నిర్బంధించియున్న 20 మంది ఫ్రెంచి కమ్యూనిస్టు ప్రముఖులను తుపాకులతో ప్రేల్చిచంపివేసిరి. అనుమతిలేకుండ ఆయుధములు ధరించియున్నందులకుగాను 27 వ తేదిన ఇద్దరు ఫ్రెంచి పౌరులు, జర్మను సైనికాధికారులచే మరణ శిక్షకు గురిచేయబడిరి.

సర్వియాలో కమ్యూనిస్టులు ఇంతవరకు 200 వంతెనలనుపడగొట్టి ఆక్సిసు సైన్యములకు చాల తొందరగలిగించుచున్నారు.

బొహిమియా, మొరావియాలకు హిట్లరుచే రక్షణాధికారిగ నియమింపబడిన వాన్ న్యూరత్ గారు తమ పదవికి రాజీనామా నొసగిరి. ప్రజలలో వ్యాపించుచున్న తిరుగబాటు చర్యల నణచలేకపోవుటచే ఆతడు రాజీనామా నీయవలసివచ్చెను.

న్యూరత్ గారి స్థానమున రక్షణకర్తగ నియమింపబడిన వాన్ హెడ్రిక్, 28 వ తేదిన ఉద్యోగమున ప్రవేశించిన వెంటనే, దేశపరిస్థితులు ఉపద్రవకరముగ నున్నవని ప్రకటించి, సైనికోద్యోగులకు సర్వాధికారములను గైకొనెను. ఈ యధికారములక్రింద విధింపబడు శిక్షల సందర్భమున అప్పీలుండదు.

హెడ్రిక్, వెంటనే, బొహిమియా రాష్ట్రప్రభుత్వ ప్రధానియగు యెంగినిరేవిలియాస్ గారిని అరెస్టుచేసి నిర్బంధము నందుంచుటకు ఉత్తరువుగావించెను.

హెడ్రిక్ గారు క్రొత్త అధికారముక్రింద ఆర్గురు జెక్కునాయకులకు మరణ శిక్షవిధించి అమలు జరిపెను. వారిలో ఇద్దరు మాజీసేనానులుగలరు. ప్రధాని ఎలియాస్ గారు విద్రోహచర్యల ప్రోత్సహించెనను నేరమునకుగాను ప్రేగు పట్టణములోని జర్మను న్యాయస్థానము, అతనికి మరణ శిక్షను విధించెను. ప్రభుత్వాధ్యక్షుడగు హాచాగారిని తొలగించి, బొహిమియా, మొరావియాలను, జర్మనీలోకలిపివేయుటకు హిట్లరు ప్రయత్నించు ననుకొనుచున్నారు.

## విషీ.

విషీ ప్రభుత్వమునకు ప్రతిగ, స్వతంత్ర ఫ్రెంచినాయకుడగు డిగాలిసేనాని యేర్పరచిన ఫ్రెంచి సామ్రాజ్య పరిపాలక సంఘమునకు 25 వ తేదిన 9 మంది "కమిషనరులు" నియమింపబడిరి. దీనికి డిగాలి సేనాని అధ్యక్షుడు మిగిలిన కమిషనరులు మంత్రులవలె వ్యవహరింతురు.

సోవియటు రష్యాప్రభుత్వము, డిగాలీ సేనాని యేర్పరచిన ప్రభుత్వమునే సరియగు ఫ్రెంచి ప్రభుత్వముగనంగీకరించెను.

## తటస్థ రాష్ట్రములు.

స్పెయినునందు బ్రిటిషు రాయబారియగు సర్. సామ్యుయేలు హోరుగారు, ప్రసంగించుచు బ్రిటనుయెడల స్పెయిను వైఖరి 15 నెలల క్రిందటికంటె యిపుడు పూర్తిగ మారిపోయెననియు స్పెయినునందిపుడు బ్రిటనుకు చాలమంది మిత్రులుగలరనియు తెలిపెను.

## నౌకా నష్టములు.

"జాంజాం" అను ఈజిప్టు నౌకనుముంచిన "టుమెసిస్" అను జర్మను నౌక అట్లాంటికు సముద్రమున ముంచివేయబడెను.

గత మూడు నెలల యుద్ధములో, బాల్టికు సముద్రమందలి రష్యను నౌకలు విమానములు 50 జర్మను నౌకలను ముంచివేసెను.

సలహా: ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరచుకొనుడు.

[మదరాసు సమాచారముల ఆఫీసరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]

MADRAS : PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.